పంకజబాంధవుం డనఁగ భాసిలు పేరికి ధర్మమూర్తికిన్
వెంకటసూర్యారాయనికి వినయ వివేకి * యథార్థవాదియున్. 45

క. ఆతం డడిగెద ననె; నిఁక, బూతులపంచాంగములును బోగరున్ వగలున్
జాతురికిఁ దక్క కోఁతలు మూఁతంబడు నమ్మఁ డతఁడు బొంకుంగూఁతల్

క. 'దానన్ లాభంబే మని, యా'? నీవడిగెదవు, వారి కాపై నేనిన్
జ్ఞానంబు గలుగు ననియున్, దానన్ యశమబ్బు ననియుఁ దలఁచెద సఖుఁడా!

గీ. ఎఱుఁగు నీతండు నాయొద్ద నెంతవఱకుఁ
జదువుకొన్నాఁడొ, పిదప నీసాహసమున
కెట్టులొడిగట్టి పాపంపు గుట్టనెక్కఁ
దలఁచుచున్నాఁడొ, సర్వమ్ము తథ్యముగను. 48

క. నాకడకు వచ్చునప్పటి, కీకవి జ్ఞానం బదెంతో, యీ డెంతయొ, నా
కాకత్వ మితని కోకిల, పాకత్వముగూడ నెఱుఁగు భవ్యుఁ డతండే. 49

---

* "మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి. శిష్యుడు రావు వెంకటసూర్యారావు కృతానేకవందనములు............ నేను యిచ్చటకువచ్చి వారంరోజులు అయినది. అది మొదలు యిప్పటివరకున్నూ, అత్యద్భుత శతావధానులదర్శనం చాదామని ఎంత యత్నించినన్నూ నాకు సందర్భించక పోయినందున రెండుసార్లు వారిబసకే వెళ్ళినను, సమావేశం కాలేదు. కారణం నేను వ్రాయచాలను. ఇంతకూ అట్టిలాభం నాకు ప్రాప్తించినదికాదు అని అనుకున్నాను...... ప్రస్తుతం చాలా పశ్చాత్తాపంలోకి వచ్చినట్లు నా ఆప్తులవల్ల రూఢిగా విన్నాను. నేను వక్కసారి సమావేశమయినచో ఎంత అందముగానైనా యుండును. గాని వీలుపడ్డదికాదు వక్కసారి సమావేశమయిన యెడల మీకు నేను శిష్యుడనైనందుకు గురుఋణం తీర్చుకొనిన వాడను అగుదును ఆపని ఈసమయంలో నెరవేర్చలేనందున నేనున్నూ వారివలె గుర్వువిషయంలో కృతఘ్నుడనే కావలసివచ్చినది......... నా ఆప్తులున్నూ నేనున్నూకూడ మీగీరతమునే త్వరలో చదివి ఆనందించు కుతూహలంతో నున్నాము. గీరతంయొక్క పూర్వోత్తరం పిఠాపురంలో వున్న పండితులు అందరికిన్ని పద్యములు నోటికి రాకపోయినా సంగతియావత్తున్నూ చెప్పినాను. అటువంటి గ్రంథం బయలుదేరితే లోకమునకు ఉపకారమవుతుంది అని అన్నారు. అంతా......వేస్తూన్నారట........" రా॥ వెం॥ పిఠాపురం, 16-1-11.

ఉ. ఏ నలనూజివీడుపురి కేగి వధానము సేయునాఁటి కీ
జ్ఞానిశిరోవిభూషణము ధాతుఁడు గాఁ జనుఁ దెంచె నాకు వి
జ్ఞానము బోధ సేయుటకుఁ గా దయ గల్గిన వాఁడు గాన,
వ్వానిని సూర్యరావప్రభు వాస్తవ శక్తిఁ జూచినాఁడటన్. 50

శా. సూరిశ్రీసకలస్వవేత్త యగు నీసూర్యుండె సూ! పూర్వ మ
ప్పారాయేంద్రుని సన్నిధానమునఁ గాపట్యంపు విద్యాఖనిన్
శ్రీరామాఖ్యశతావధానిపసఁ దేల్చెన్; మీఁద నాసూరి న
ప్పారా వొక్కఁడె కాక తన్నగరమే వాకోదు తత్త్వజ్ఞుఁగన్. 51

శా. అప్పారావునసంతరమ్మునను విద్యావేదులైనట్టి నా
రప్పారావును, నమ్మహాత్మునను జుంౖనట్టి సింహాద్రి శ్రీ
యప్పారావును జూడవచ్చె నితఁ; డయ్యార్యుల్ "భవచ్ఛక్తి మా
కొప్పున్ బో" దని తండ్రిఁబోల్కి నని రార్యుల్ తత్త్వ మూహింపరే.

అ. వె. ఈరసజ్ఞమూర్తియే కాదు శ్రీకూచి
కులుఁడు నారసింహకోవిదుండు
గూడ నెఱుఁగు నితనిగురుతయు, నాశిష్య
భావ మదుగ నతఁడు పలుకు నిజము.

క. ఎవ్వారుపలుక నేటికి, అవ్వారు రట్లును నిదేల రసికులకు? ననున్
బుట్టుఁగఁ దిట్టిన వ్యాసమె, ముప్పాలు గట్టికొని యిట్లు మెఱుఁగుచునుండన్

మ. ఎవ రీకోకిల! శ్రీమదోలెటికులాహీనాబ్ధిరాకావిధుం
డవు శ్రీ వేంకటరామశాస్త్రియను లోకాహోది; కాకం బెవం?
డెవఁడో యెట్లగు శాస్త్రిగారి గురువౌ నీ వేంకటేశుం డహో!
యెవఁడీ కొంగ? దివాకరాన్వయమణీ! యీ వేసమీ శ్రీపతీ! 55

సీ. నాయెడఁ దాఁ గృతఘ్నత్వనామకమహాపాతకి యౌట విస్పష్ట మంట!
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బరమందుఁ గనుట తప్పనిదె యంట!
అంతియే కాని నాకాతఁడు శిష్యుఁ డంచని నేను జెప్పు టనర్హ మంట!
పైదానఁ దనకీర్తిఁ బబలించునేకాని నాదు యశంబు సున్న యగునంట!

తే. గీ. ఔర! యెటువంటివేదాంత మభ్యసించె?
"నేమి శాశ్వత మాగోడ యించుకంత

యవల జరిగించి పెట్టికొం" డని వచించు
వెట్టివేదాంతితన మిట "బట్టు" మనియె. 56

## (౩) సంబుద్ధిపర్వము-

క. "మావాఁడతిదుర్మార్గుఁడు, మీవాని శిరమ్మునందు మేకులు గొట్టుం
డేవేళ నేమి సేయునొ, కావలమున" నన్న నీతి గనఁజేసెదవా! 57

ఉ. వేంకటరామశాస్త్రి! విను విద్యపఠించితి నంచు నొప్పుకో
జంకియుఁ గోకిలమ్మవయి చక్కఁగ స్పష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "చెప్పెపెమెమ్మెమె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పికొంటి; వది చాలు జయం బగుఁగాక నీ కిఁకన్. 58

ఉ. "కాక" మటంచుఁ దిట్టుదువు గాక, శ్వపాకుఁడ వందుగాక, యిం
కేకలుషంపుపేరు లిఖియింతువు గాక! స్వకార్యసిద్ధి నేఁ
జేకొనినాఁడ నేఁడుగద! చేకుఱె మోదము; నీవు తిట్టి లే;
దీకవి నీతఁడే యురక యిట్టులు తిట్టుకొనెన్ గుమారకా! 59

ఉ. "చప్పనికూఁతలే" యనుచు ఛాత్రుఁడవై గద! నన్ భజించుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ వప్పటి కయ్యా నీవు నీ
చెప్పును గాని నాదరిని శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బొప్పెనె యిట్టితిట్టుల కహో! యిటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే? 60

చ. మొదట "రిజస్టరుత్తరము" మోటుతనం బగుపట్టకుండ నేఁ
గద లిఖియించి తిర్పతిని గయ్యముకై పురికొల్పినాఁడ; నీ
వది గని యెంతగా బెదరి తయ్యయొ? పాతకినైతిఁ దండ్రి! నా
యదయత సైఁపుమయ్య! యిఁక నైనను భీతిని మాను మర్భకా! 61

చ. "తిరుపతిసింహ మొక్క మొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమున నున్న నాపయి 'గుభుక్కున' దూఁకు" నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు 'వి
శ్వర' యను వేరుసుమ్మ నిను జంకఁగఁ జేసిన దేమిసేయుదున్. 62

శా. నీయజ్ఞానము నీదులోభగుణమున్ నీదౌ కృతఘ్నత్వమున్
నీయల్పజ్ఞతఁ జేసి గాక యకటా! నీమీఁది కే మంచు యు
ద్ధాయత్తుం డయి రాఁగడంగు నొకఁ? డే నవ్వానిఁ బ్రాణాలతో
డాయన్నిత్తునె? నన్ను వీడిగద! కట్టా! చెట్ట వైతింతకున్. 63

చ. తిరుపతిసింహముల్ సరిగఁ ద్రిప్పి పరిక్రాంతమొనర్ప వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు గీపకు నోజ గూర్పు నీ
గురునకుఁ జగ్గచంద్రునకుఁ గూడ వశం బెటు లయ్యెడిన్? దుర
ద్ధర మది, నేను దానిబలుధాటికి నొక్కొకవేళ జంకెదన్. 64

ఉ. కాఁకరపర్తిపై కుఱుకఁగా గమకించె నెఱుంగుదే? "శత
ఘ్ని"కృతి సాహ్యకర్తలును నీవును బావయుఁ బోలె 'శృంగభం'
గాకలనప్రసంగ మది యజ్ఞతమై లిఖియించినట్లె వా
పోకయ పోయినట్టులుగఁ బూర్తిగ దేఁకిరి జ్ఞప్తియున్నదే? 65

ఉ. వెంకన బందు వౌకతన వేఁదుఱు వ్రాఁత లొకింత సైఁచు; మీ
ర్జంకుటగాఁ దలంచి వెలుచం గుఱుచల్ లిఖియించుచుంద్రు; మీ
వెంకెతనాలు సాఁగ పల బెబ్బులిపై; వెలనాఁటి సింగ మి
జ్జింకల నింకఁ జేయు నెపుడేనియు; డొంకలె సూ శరణ్యముల్. 66

ఉ. ఏది, సముత్తరం బతని యేడ్తెఱవాఁ తకుఁ జెప్పుమా? శిర
శ్ఛేదముకాదె పందె మిడె! సిగ్గు గలట్టి నృజన్ముఁడేని * "మీ
రే దెసకేని బొం" డనుచు నీయఁగఁ జేయునె యుత్తరంబు దా
యాదుని పేరు పెట్టి! యఘరా, యివిరా! చవిరాని బీరముల్. 67

ఉ. "పొం డలపీఠికాపురికిఁ బొం డటుపొం" డని నీదుబావ బా
వొండొకలేఖ వ్రాసె, నది యూఁతగ నయ్యెడ కేగుదేర న
వ్వండొకొ తోఁడు "మీ రిటకు వచ్చితి రేటి?" కటంచు, నెందుకీ
గండతనంపు వ్రాఁతలు జగంబు మొగంబుల నవ్వుచేటు సూ. 68

చ. "పిలిచినయప్డు రాక యటు * బెట్టుగ నుత్తర మిచ్చి యెవ్వరో
చలపతి 'పీఠికాపురముచక్కికిఁ బొ' మ్మనినట్లు లెవ్వరో
గిలికిన వచ్చువాఁడవె? నగించెడి నీదుప్రసక్తి" యంచు న
వ్వల నల తోఁడు నవ్వలరఁ బల్కిన నుత్తరమేది పుత్రకా! 69

* గీరతము, 1 భాగము శాఖాచంక్రమణపర్వము చూ. 10 వ పుట

* శ్రీపీఠాపురీ రాజపుత్రోదయవిషయికపద్యత్రయము.

సీ॥ ఉదయించె రాజు రావూవన్వయోదన్వదభివర్ధనుండు సూర్యాంశవలన
జన్మించె సంతానశాఖి నందనశుభశ్రీ పెంపుమీఱఁ బిఠాపురమున। నెపలెఁ

ఉ. కరుణ గలట్టి మెత్తనగు కాకిని గేరడ మాడినట్లు గా
దరయఁగఁ గొంగపై కరుగు టంచని పూర్తిగ బుద్ధి వచ్చియున్

దనూసంభవుఁడు సూర్యునందు నారాయణాంశం బున్నదంచుఁ దెలుపఁ, బోడమె నాం డాలమ్మకడుపు చల్లఁగ రాజసస్యంబు సజ్జన క్షేమ మడఁప॥ గీ॥ మంగమాంబ గణించిన మాననీయ। సుకృతపరిపాక మెల్ల నేఁటికిలభించెఁ। గంటికగపడె రావు గంగాధరోప। పదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తనిసె సాధారణం బసాధారణముగ। మఱియు నందును నాశ్వయుజ్మాసబహుళ। పక్షముఁ దృతీయయును శుక్రవాసరంబు। మకరలగ్నంబు సూర్యసంభవునివలన। మ॥ గురుఁడున్ సూర్యుఁడుఁ జంద్రుఁడున్ గుజుఁడు శుక్రుండున్ బుధుండున్ శనై। శ్చరుఁడుం గేతువు రాహువుం గలసి యశ్రాంతంబు నీబాలునిన్। సిరి దీర్ఘాయు వొసంగి, ప్రోతురు బుధాశీర్వాదముల్ తోడుగా। నరవిందాక్షునకుం సహాయు లయి సూర్యారాయభూపాలకా !

25-10-10 }
కాకినాడ. }

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.
శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటా
కృష్ణారావు బహద్దరుగారి యాస్థాన విద్వత్కవి.

True copy of letter from the Private Secretary to the Rajah of Pithapuram dated 29th October 10, addressed to Brahmasree Satavadhani D. Tirupati Sastri Garu.

"I am desired by the Rajah to convey his thanks to you for your congratulatory verses on the occasion of the birth of his son and heir."

(శుభలేఖ పంపినప్పటి జ్ఞాపనము.)

మ. ఘనవంశావళి గల్గువాఁడవని చక్కన్నీదరిన్ జేరి నే। రినదివ్యోక్తిన
దుర్గజమ్ముల నక్షక్రీడావినోదమ్ముగాఁ। దునియల్ సేయఁదలంచుచుండినమ్మా
నేండుర్వింపొరకే వచ్చిపో। యిన గర్వింపరె? యెప్పుడేని యిటఁజల్లే వచు।
భూభృన్మణీ! తి॥ శా॥

దిరిగియు * "జార్జి" పద్దెములఁ దేఁకుపమాలుదొసంగులన్ గనం
బఱుపఁగఁ బూను మీకుఁ బరువా? కఱవా? తెరువాటుదాఁటులన్.

ఉ. "ఈశ్వరవేఱు లున్న యెడ కేగుఁ" డటంచు చోక బంధుమాత్రునిన్
బశ్వవతారు నూఁతగొని పల్కితి; రాతని చెయ్వులన్నియున్
శశ్వదుదారకీర్తుల ప్రసంగములో బయలయ్యె వింటి; లో
కేశ్వరుఁ డెట్టిచుట్టఱిక మేర్పడఁజేసె సెబాసు! షేల్! బళీ!

క. విను నీపినతండ్రికుమా, రుని గనుఁగొను మతఁడు చెప్పు రూఢిగఁ; దావృ
ష్టును నలతిర్పతిఁ దిట్టెం, గను బూన్చితి రెంతకేని గలవాఁడు సుమా.

క. అతఁడేల చెప్పవలె? సం, స్కృతనిశ్శేషావదాతకృతనిద్రాసం
గతిగతకాఁకరపత్రి, స్థితసుపుత్రనేత్ర మడుగఁ జెప్పు నఖిలమున్.

ఉ. అట్టిఁడతండు కావుననె యాతని వ్రాల్ గలయుత్తరమ్ము మా
పట్టుననుండె నం చెఱిఁగి బావ "యతండు † దది వ్రాయలే" దటం
చొట్టులు సత్యముల్ గిలికి యుత్పథచారిగ మాఁకఁ జొచ్చె "వీఁ
డిట్టిఁడు బొంకి యాత్మ కెటులేని యశం బొడఁగూర్చు" నం చొగిన్.

క. తాదృశులుదక్క మీ దు, ర్వాదములకుఁ దోడునూప రా; రతఁ డేనిన్
బాదాక్రాంతత కొడఁబడి, నీదగు నఘ మడఁచెఁ గొంతనీతి గలాఁడే!

---

(*కవితా పత్రికలోని "అట్టహాసము" నుండి)

*...ఈపద్యము వ్రాసిన మహాకవి యెతడోయని యాలోచించుచున్నట్టున్నారు ఈయన పోలవరము సంస్థాన పండితుండు దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధానిగారు...పరి యాచకమున కేమిగాని యీపద్యము వెనుకటిజాసకన్నను మస్తిలోనున్నది. ...... ఇట్టితప్పులతడకను బ్రకటించి నందులకుఁ గొంకియే కాఁబోలు విశేషజ్ఞుఁడనిపించుకొనుచున్న వేంకటశాస్త్రిగారీపద్యమును దోసి రాజని కృష్ణాపత్రికలోఁ దక్కిన 'పద్యములను మాత్రము ప్రకటించియున్నారు. (ఇట్టివనేక హాస్యములు)

† తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంథకర్తకు రిజస్టరు జాబు వ్రాయుటచేఁగాని యాతఁడు వ్రాసినట్లు యథార్థవాది యభినవ సరస్వతీపత్రికలోఁ బ్రకటించిన యుత్తరముచేఁగాని ప్రయోజనము లేదు. ఆయుత్తరము సత్యాసత్యములు సమయము వచ్చినప్పుడు తేలకపోవు. ...

(నవంబరు 24 వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

చ. కలతెలుఁగున్ లిఖించె నలకాతఁడు డక్కట! పేరు పెట్టి; యు
వ్వల నెవరో లిఖించు నలపత్రము తన్ను ఘటించి తిర్పతి
జ్వలనము చుట్టుముట్టు నని సందియ మందఁగఁ బోలుఁ బాప? మే
కొలఁదియుఁ గాని తన్నెఱుఁగకున్న జగంబు మఱెంతనవ్వదే!

క. తిరుపతి ధోరణి తెలిసెనె, "శర"ణని నీబావకై యశస్కుఁడతోన్
దరి నిడినబావమఱఁదినిఁ, బోరిఁబోరిఁబలికించి కాచి ప్రోచెన్ గరుణన్.

చ. అతఁడు కృతజ్ఞుఁ డౌటఁ జుమి యాత్మకు వెంకననాము వీని నీ
చతరపికాభివర్ధనుని ‡ సద్గురుఁగా లిఖియించె; దానిచే
నితనికి వాఁడు తక్కు వని యెంచుచుఁ దిట్టితి వెంత బేలవో!
కృతమును జూపనంతటనె కేవలనీచుఁ డెవండుఁ గాఁడు సూ!

చ. కృతమును జూపకుండు నరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ దత్తఱంబునన్
మతి చెడి "కాక" యంచు నొకమాటును గల్పనఁ జేసి నన్నుఁ ది
ట్టితి వది యేమికార్యము! కడింది యశమ్ము గడించుతోవయే!

చ. "తిరుపతి నాపయిం గవిసెఁ దీవ్రత మద్గురుఁడైన వేంకటే
శ్వరుని కతానఁ గాదె" యని శాంతి యెఱింగిన నీవు తద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము సూటిగ వ్రాయక యేటికయ్య? యా
దురితప్రవాహత; కృష్ణుఁ డెటు దోఁపఁగఁ జేసెఁ గుమారు! చెప్పవే.

క. నరుఁడగు శాంతిం గఱపెడి, పరమోత్తమగురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁగాకి నని నీకుఁ దోఁచినదె కదా!

చ. "గురు వని చెప్పనందులకుఁ గోప మిదేమిటి? కీపనుల్ యశ
స్కరమగునే?" యటంటి; వది సమ్మతమే; కొమరుల్ గలారు నీ
కరయఁగ వర్ధమాను లిటు లాచిరజీవులు నిన్ను నల్పన
త్తరుణమునందు నీహృదయతాప మ దెట్టిది యౌనో తెల్పవే 82

‡ మ. భవుఁడన్ భావపదారవిందభవుఁ జెల్వొప్పిళ్ళవంశార్ణవో | ద్భవునిన్ శాస్త్రసదంపదానసహభవున్ భాస్వద్గవున్ సాహితీ | ధవునిన్ మేఘగభీర విస్ఫుట రవున్ ధైర్యప్రభామేరువున్ | గవితాసద్గురు వేంకయాభిధుని వక్కాణింతు నెక్కాలమున్ (ఇది తి॥శా॥ గారి మొదటికవిత్వము, కుమారసంభవములోనిది )

క. గురునకుఁ దండ్రికి భేదం, బరయంగా లేదు; శిష్యుఁడనఁ గొమరుండే
యెఱిఁగినవారికి; వాఁడే, తిరస్కృతిఁ జూప మదికిఁ దిగులు గలుగదే.

క. ఇదెగాక నీవు చుట్టమ, వదియు విచారింపఁ బుత్రితాపాదకమే
గద! * ‘బా’ బనివ్రాసిన నీ, సదమలమగు లేఖ కలదు చదువుము దానిన్.

క. నీజనకు నాయనమ్మయు, నాజనకుని తల్లి యొక్క నాయనకును నొం
డే జననికి జన్మించిన, యోజ నెఱుంగుదువొ? మఱచితివొ? గురునిబలెన్

ఉ. ఏ నల చర్ల బ్రహ్మయ మనీషియెడన్ గడుభక్తియున్ గృతం
బూనినవాఁడ నం చెఱుఁగు యోగ్యుఁడ వీ వది నమ్మ దేని నా
మానసమందు నున్న యిది మాత్రము నమ్మక పోవు కాన నీ
శానుని సాక్షిగా వినుము సర్వము దెల్పెద నారహస్యమున్.

ఉ. ఏ నల పీఠికాపుర నరేంద్రుని చెంతను జేరి తన్నృపా
స్థానమునందు నుండుటకుఁ దద్దయుఁ గోరినవాఁడ నౌచు నీ
పైని నసూయ గొంటి నని పల్కుట దెల్పితి వీవు వ్రాఁతలో;
నీనుడి నిక్కమే యగునె? నీవు నెఱుంగుదు నాదుభావమున్.

---

సీ. తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి
రెండు, భాషలలోఁ దత్కృపన్ గవియయ్యు ననేకముల్ శతలేఖినీకవిత్వ, తం
త్రముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యనఘుఁ గూడి,
శ్రీపోలవరపురీభూపాలుఁ డాంగ్లేయ భాషాప్రవీణుండు బహుకళాఢ్యు, తే గీ. రం
ఘుండతిశాంతుండు సరసుఁడునగు, రామచంద్ర వేంకట కృష్ణరాయచంద్రు,
నొద్ద బుధుఁడును గవియు మాన్యుండునై చె, లంగు తిరుపతి శాస్త్రి తెలుంగుఁ

* బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులబాబుగారి సముఖమునకు. ఓలేటి వెంకట్రామయ్య నమస్కారములు చేసి వ్రాయు శుభలేఖార్థములు... శుభముహూర్తమునకు సకుటుంబపరివారముగా దయచేయగలందులకు ప్రార్థించుచున్నాఁడను... తమరు రచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒక్కొక్కటి చొప్పున పంపించగలందులకు ప్రార్థించుచున్నాను. దయయుంచవలెను.”

పల్లిపాలెం, ఓ. వెంకట్రామయ్య.

ఉ. ఎందఱు రాజు లుండిరి ! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియుక్
విందుతనంబు గల్గిన వివేకులు; వారలయొద్ద నుంటినే !
గందరగోళ మైన మది గల్గినవాఁడ, స్వతంత్రుఁడన్, జిదా
నందుఁడ నే ‡ నొకానొకని నాయకుఁగా వరియించి యుందునే.

ఉ॥ అన్నములేవొ ! వస్త్రమునకై కొదవుండెనొ! యున్నదానినే
యెన్నఁగ నెవ్వఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గానరాఁడు; నీ
యన్నముకోసమై మనమునందుఁ బ్రియత్న మదేల నాకు ? నీ
చిన్నతనంపుమాటలకుఁ జేతము పొక్కెడి దుఃఖ మెక్కెడిన్.

ఉ. నిక్కముగాఁ బిఠాపురికి నేఁ జనుదెంచెడివాఁడ నేని ని
న్నక్కడఁగింపఁగా వలయునో! నరపాలుఁడు నిన్ను నన్ను నొం
డొక్కరుఁగూడ నేలుకొనఁ డోటు! సమర్థత లేనివాఁడొ! నా
కక్కఱయున్న తేనికడ కంతకు మున్ జనుదేరకుందునే?

ఉ. ఎందఱో భార్యలుండియును నింకొకచాన స్వయంవరంబుగా
నందముపొల్చు జాణ తనకబ్బినఁ గైకొనరే నృపాలు? రా
చందమునన్ మదీయకృతిచంపనగంధిని గూడ మీనృపుం
డందఱితోటిపాటు తనయా ! కొని యేలఁగవచ్చు నచ్చుగన్.

తే. గీ. ఏకపత్నీవ్రతముగూడ నిట్టిపట్టు
నందు రామాదులకుఁ బోలె నడ్డు పడద;
రాము పేరిట నెందఱు ధీమహితులు
తమ కృతికుమారికల నిచ్చి తనియరయ్య !

ఉ. జంకితినందువో ! యధిపుసన్నిధికిన్ దగ నందువో ! తదీ
యాంకమునందు నొక్కఁడును నక్కట ! నాసరివాఁడు లేఁడె, "ని
శ్శంకగఁ గాకి పంజరపు సత్కృతికిన్ దగ" నందువే ! యెటుల్
బొంకెదు సర్వముం దెలిసి పుత్రిక ! తండ్రికిఁ జేటు గూర్చెదే?

---

‡ మ. నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁ గాదు; నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెరిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె యంబా! దేవి! కామేశ్వరీ! (కా॥ శ॥)

కడియములోనఁ గల్గు జనకాండము సర్వము నెన్నిమారు
గడెగడె కా నృపాలమణిఁ గాంచఁగ నేగు మటంచుఁ జెప్పు ? రా
నుడు లవి నేను నూఁకొనియుంటిఁ నృపుఁ జూడమి కేమి హేతువో
కొడుక ! యెఱుంగవే ! యెఱిఁగి కొంకక "కాక" మటంచుగిల్కెదే ?

క. కడియమునకు పేనికి నె, ప్పుడు సంబంధంబు గలదు పుత్రిక ! నీయా
ర్పుడమికి పేనికిఁ గల దె, క్కడిసంబంధంబు ? చెప్పఁగలవే నాకుఁ.

*క. ఎందుకుఁ జన మానితినో, పొందుగ మును వ్రాసినాఁడ; బొంకందువొ ? లే
కందుల కొప్పుదువో ? నా, కిందులకుఁ జింత లేద యించుక యేనిఁ.

క. ఎన్నో బూతులు దిట్టితి, వన్నియుఁ గోకిలపుఁగూఁత లనుకొనియెద; నా
కున్న యభీష్టము దీర్చితి, వన్నా ! "కాక" మన నేమి, యదియు సుదంజే.

తే, గీ. కడుపు నిండిన బేగమ్మ గాని నాకు
నేనృపాలుని జూడంగ నేమిఫలము ?
నట్టిచో మానృపాలకుఁ డాతఁ, డతని
నేలదర్శింప రాకుందు నెఱుఁగఁజెపుమ ?

‡ తే. గీ. ఎలమిఁ బిలిపించి స్వయముగ నెంతొ ప్రేమ
గారవించుచునుండెనూ! గౌరినాథ
శాస్త్రి; స్కూలున నుద్యోగసరణినుంచి
యతని విడి వత్తునెట్టు లేనవుల కవుర!

* గీతము 1 వ భాగము ఇతిహాసపర్వము చూడుఁడు.

‡ శ్రీవేదమూర్తులైన శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి జంఝ్యాల గౌరీనాథశాస్త్రి అనేక నమస్కారములు... మీ వుభయులున్నూ ప్రతిసంవత్సరం సంస్థానములలోకి వెళ్ళివస్తూ సంచారాభ్యాసం కలవారుగాన స్థాయిగా యేకత్ర వుండడం దుష్కరంగా తోచునేమో? ఇంతకు వెళ్లదగిన స్థలములు అయినవి వయస్సుకూడా వృద్ధియగుచున్నది. ఇట్టిస్థితిలో స్థాయిగా నియమ్రప్రమైన జీవనోపాధి యేకత్ర దొరికినప్పుడు అక్కడనే వుండి తీరిక కొలది గొప్పగ్రంథములుగాని పాండిత్యముతో చేరిన మరివకటి గాని చేస్తూ కాలయాపనం చేయడమందు మీకు తాత్పర్యం వుండవచ్చునని నేను తలుస్తాను. మీ వుభయులలో నెవరో యొకరు యీ ఉపాధ్యాయస్థానమును అంగీకరించ.

## (4) బందరుపర్వము

క. గౌరీనాథ బుధుండనఁ, గా రాజో? రెడ్డొ? చెప్పు, కాకమ! యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కర్మఠుఁడు సుతా!

క. న్యూబుకళార్థులు మాకై, చాలన్ యత్నించి సభనుసల్పియు మొనమొ
న్నేలాగు గౌరవించిరొ! బాలక! పాత్రమ్మునందుఁ బఠియింపవొకో?

క. బందరన నిట్టి దక్కడ, "సందేహము లేదు బావ శాబ్దికజీవుల్"
చిందులు ద్రొక్కఁజనఁగ గో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ!

క. బందరనఁగ నిట్టిదియట, నెందఱొ యున్నార రెల్లయెడ విద్వాంసుల్;
తొందరపడు నవధానుల, చిందు లచట సాగిరావు శిష్యుఁడ! వింటే?

క. 'బందరనగ నెట్టిది' యని, సందేహము లేదు బావశాబ్దికజీవా
నందుని బోలెడు శ్రీరా, ముందగ నొకమాఱడిగి సమూల మెఱుఁగుమీ!

క. బందరులోఁ గోకిలకవి, చందిరులకు బిచ్చమైన సాగదు; కాకం
బుం దిలకింతురు, కపటపు బొందలయత్యద్భుతములు పొసఁగవు సుమ్మా!

క. బందరునకె యొకపరి మీ, "సందేహము లేదు బావ శాబ్దికజీవా"
నందుని నే రమ్మంటిని, జిందులు సాఁగవని యటకుఁ జేరఁడు వినుమీ!

క. అప్పటికిఁ జిలుక కాలే, దెప్పుడు పంజర మనంగ నెట్టిదొ యెఱుఁగం
డిప్పుడొకసారి యడుగుము, చెప్పు నతఁడు ధారణావిశేషము కలిమిన్.

క. ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద వచ్చునేమొ? కృష్ణకవీంద్రున్
దప్పక పేర్కొపింపుము, చెప్పుము నరపాలుఁ డేల సెల వీఁడు? సుతా!

క. సంగన్నగారు వీణా, శృంగారవతీవినోదచేష్టాహృష్టా
త్మంగులు తత్తన్వంగ్యా, లింగితులై యెటకు నేని లేదే చనుటల్?

తే. గీ. ఒక్కసంస్థానమందు మీయునికికేమి,
ఏటిపోలిక వారికి నెందు మీకు?

వలసినదని నాతాత్పర్యము. మీరు కావలసిన ప్రతిష్ఠను యిదివరకే పొందినారు; వచ్చే ఆదివారం తిరిగి మీటింగుచేసి యెవరినో సకరని మేము అప్పాయింటు చేయవలసి వున్నది. ...అంతకంటె విళంబనము చేయజాలము. త్వరగా జవాబు పంపించకోరుతాను.

జంధ్యాల గౌరీనాథశాస్త్రి.

అక్కటా! * వీణరూపంబు నడుగఁ బాడు
చేసినది చూచి నేనెంతొ సిగ్గువడితి.

క. ఈసిగ్గున నేమయ్యెడఁ, జేసిన యవధానమందుఁ జెప్పిన కవనం
బేసరసముగాఁ బడినదొ, యా సర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్.

క. ఆనరపతికిని మన యవ, ధానులు గండ లనఁగీర్తి దవులు, నదియుఁగా
కేనాఁడు నాజ్ఞగొని విద్యానిధు లెక్కడికిఁ గాని యరుగుటలేదే!

క. ఇది యిటులుంతెము; బందరు, పద నెట్టిదొ రామశాస్త్రిఁ బరమాద్భుతపుం
బదము గలశతవధానిం, గదిసి యడిగి తెలిసికొన సకలమును దెలుపున్.

క. అప్పండితు నవధానము, నప్పుడు 'జడ్జీ కలెక్టరా'దులు సభలో
నొప్పిరిసూ! వార్ 'సీ' యనఁ, జెప్పె పెయని యొకనముస్సు పెట్టె నడుగుమీ!

క. ఇది యప్రస్తుత; మతఁడును, సదయత నినుఁబోలెఁగాక చక్కఁగఁగొన్నా
ళ్ళొదిగెం గాకము కడ బ, ల్లిగ్నుఁ డగు మీకృష్ణసుకవిలీలన్ హేలన్.

## (౫) సమృద్ధిపర్వము.

క. ఇఁకఁ బ్రికృతము వినుమయ్యా, పికరాజమ! నెనుకఁబోలెఁ బృథివీపతులన్
నకనకలాడెడి పొట్టకుఁ, గకవికఁ గనుఁగొను పరిసక్తి కలుగదు సుమ్మా.

ఉ. పొట్టలు మూఁడు మావి, సరిపోవును బుట్టెలు మూఁడుమాకు; ని
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదొక్కొ, నీ
కెట్టులు దోఁచె. లోకు లిది యెట్టులు నమ్మెదరంచు వ్రాసి తీ
చెట్టశలంపుమాట! యిటు చెప్పుట పాపముకాదె పుత్రికా!

చ. నెల కొక నూఱురూపికలు నీదయకల్మి 'కనీసపక్ష' మొ
ప్పొ లొలుకు నాదుపుస్తకపుఁ బుత్రిలు దెచ్చి యొసంగువారు; పై
నెలమిని రోజు కొక్కకటి యిత్తురు రూపిక నూర్కలులోన; నెం
దుల కిఁక దేవిరింపవలెనో? నసుఁ గోరని కోండ్ర సన్నిధిన్

(వెంకటరామకృష్ణ గ్రంథమాల 74 వ పుటనుండి)

* వీణాస్వరూపము, (సంగమేశ్వరశాస్త్రిగారు కోరినది)

క. వీణాస్వరూపమెన్నఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికుల నభినుతింపఁగ, వాణియె యసమానురాలు వసుధాధీశా!

ఉ. ఎక్కడి కేగ కూరకయ యింటనె యుంద మటన్నఁ గాని నా
కెక్కడినుండియో సభల కెన్నియొ ♦ జాబులు వచ్చుచుండు; నం
దొక్కసభఁ బొనర్చినను నొక్కశతావధానముఁ జావు లేదు! నీ
కెక్కడి యూహపుట్టెను? నిది యెవ్వరి కిత్తునో తెల్పు పుత్రికా!

---

(1)♦ విధేయుడు బంటా శ్రీశయిలం కృతానేకశిరస్సాష్టాంగనమస్కృతులు. ...తమవలన జరుపబడు అష్టావధాన శతావధానములయొక్క కష్టము తెలిసి తమకు సరియయిన మన్నన రాజలోకమువల్ల జరుగవలయునే గాని మాబోట్లు యేమిచేయగలమూ అనే భయము ముందుగా కలుగుచున్నది. అయితే చంద్రునకు నూలుపోగను సామెత ప్రకారం మాయొక్క శక్తిని గనిపెట్టి తమవంటి మహనీయులు యట్లయినను మాకోరిక తీర్పడమె ముఖ్యముగా ఆలోచించవలసినదయి వున్నది. ...గనుక నా మనవి సంపూర్ణదయతో అంగీకరించి యప్పుడయినను దరిశనమిచ్చి నాగృహపావనమయ్యేలాగు యీ బీదవాని గు...కు విజయం చేసి కోర్కెను తీర్చగలందులకు ప్రార్థించుచున్నాఁడను. ......

ఆటపాక 30-1-10 శే. క్షు, బంటా శ్రీశయిలం.

2 నే చంద్రదంగి రామారావు అనేక నమస్కారములు చేసి చేయుంగల విన్నపములు... వెనుక నేను మనవిచేసుకున్నప్పుడు తమరు శతావధానం చేసెదమని సెలవుయిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు. ఇప్పుడు తిరిగి యిక్కడ కాలేజీ విద్యార్థులు అతి కుతూహలముగా నున్నారు. ఈవిషయమై యిప్పుడు తిరుపతిశాస్త్రులవారి దగ్గరకు వెళ్లి వారి అనుమతిని పొందినాము. కాబట్టి మాయందు దయవుంచి మాప్రార్థన కనుకూలమగు జవాబు తిరుగు టపాలో వ్రాయగలందులకు కోరుచున్నాము చిత్తగించవలెను.

పిఠాపురం రాజావారి కాలేజ హాస్టలు, కాకినాడ, 27-11-11 చంద్రదంగి రామారావు.

3 ఇక్కడ కాకినాడలో స్టూడెంట్సు అవధానము చేయించెదమని అడుగుచున్నారు. వీరికిని వ్రాయుదురు మీ అభిప్రాయము చెప్పుడు... దె॥ తి॥

---

(4)...కర్ణాకర్ణి వినియుండి మిమ్మును బ్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిగారి సహా మీరు వస్తారను నమ్మకముతో నిచ్చట నీనెల 19, 20

ఉ. ఇంతటివన్నె వ్రాసికొనుటే విషయమ్ము స్వకీయ మాటచేఁ
గొంతవొసంగు, 'దాత' నని కూడ లిఖించుట యెట్టు లొప్పుఁ? గా
నంత యుదారతాగరిమ యంటనికష్టులు బ్రహ్మశాస్త్రి స
త్రాంతరభోక్తలందుఁ గల రంచనుకోకు కుమార! చెప్పితిన్.

---

తేదీలను తమ రుభయులును శతావధానము సల్పుటకు నేర్పాటు చేసినారము గాన మీరు తప్పక 18 వ తేదీకే దయచేసి మమ్ము నానందింపజేయ మిక్కిలిగా ప్రార్థించుచున్నాము. తిరుపతిశాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పకవత్తురని నమ్మకముతో కొన్ని ప్రయత్నములును జేసియున్నారము. కావున తమరు తప్పక రావలయును. చిత్తగించవలయును.

ఇట్లు విధేయులు

గుంటూరు 12-8-11 } రంగావఝ్ఝుల హనుమయ్య, (జిల్లాకోర్టు ప్లీడరు)
వేమూరి వెంకటసుబ్బారావు, (జిల్లాకోర్టు శిరస్తాదారు)

(5)...రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రమములఁ దీసికొనిపోవలయునని కుతూహలపడుచున్నారు. గనుక తాముభయులు సమకాలముననే వత్తురని యెంతును. శిష్టా హనుమచ్ఛాస్త్రి.

(6)...తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని ...తమరు శ్రీతిరుపతిశాస్త్రిగారు ఒకసారిగా గుంటూరుకు దయచేసినయెడల వుత్సవరూపకముగా గ్రామములోనికి తమరిని తీసుకరావలయునని నాకోరిక. ...గుంటూరు స్టేషను వద్ద స్నేహితులందరు తమ రాకకు యెదురుచూచుచుందురు గనుక యీప్రకారము చేయుదురని నాకోరిక.

గుంటూరు, 15-8-11. మజుందారు వెంకటహనుమంతరావు.

(7)...తాము న్ను ఆరోజుకు యిచ్చటికి దయచేసి సభ జరుపగలందులకు మిక్కిలి వేడుకగలవారమై యున్నారము. ఇట్లు విధేయుడు

పినపాడు, 15-9-1911. తూములూరి కోటయ్య.

(8)...12-12-11 అద్దంకిలో అవధానమట వత్తురా? సత్తెనపల్లికి వచ్చే ఆదివారం రాగలరా?...

గుంటూరు, 4-11-11. రంగావఝ్ఝుల హనుమయ్య.

## (6) బ్రహ్మగురుపర్వము

ఉ. అమ్మహనీయుపే రహరహమ్మను నీవును బావయున్ జప
మ్మిమ్ముగఁ జేయఁజొఁ గృతము నీగతిఁ జేసినపాపమెల్లనున్
వమ్మయి పోవు; నట్లొనరుపం బ్రియతింపుము; రామదేవుపా
దమ్ములు వొల్చు క్షేత్రమునఁ దానమొనర్చి పొనర్పు మీక్రియన్

చ. ధవళగిరిన్ మహామహుఁడతం డొకసత్రము వెట్టి, శిష్యులం
గవులను జేయుచున్ సుఖముగా మఱి వారికి నర్థికోటికిం
బ్రవిమల మన్నదానము నపారముగా నొనరించెఁ దద్గురుం
దవిలిన శిష్యుఁ డించుక యుదారత నేర్చుటదేమి లెక్కయా!

ఉ. అమ్మహనీయునింట నెల యయ్యెడు నంతకు నొక్క పుట్టెఁబి
య్యమ్ము సుమారు వారుఁ దమదైన కుటుంబముగాక శిష్యసం
ఘ; మ్మతిథివ్రజమ్మును సుఖమ్ముగ భోజనమాచరింపఁ; బు
ణ్యమ్మన బ్రహ్మపండితునికన్న మఱొక్కని కెన్న నున్నదే!

ఉ. ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి, దాని కె
న్నెన్నియొ యోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించు దానిలోఁ
దిన్నదిగాక తా రయితు దెచ్చి యొసంగుఫల మ్మదెంత హె
చ్చున్నను వీరికొక్క నెలయోపునొ, యోపదొ! సందియమ్ముగన్.

క. ఆయనమహాత్మునిభార్య గ, దా యిల్లాలనఁగ! నాఖ్యయన నేల? నిజం
బే యన్నపూర్ణ యాపె, వృథాయుంతురె యట్టిపేరు తల్లులు పెద్దల్!

ఉ. చెన్నఁటిచూపుచూచి యొకశిష్యుని నేనియుఁ 'నేమిరా' యటం
చు న్నిరసించి పల్క దిది చోద్యము; దేశికభార్య లిట్టివా
రున్నది యింటిమే? మఱియునొక్కటి, లోకులు తన్నుఁ దిట్టినన్
సన్నుతిఁజేసినన్ సమము; సాటిమ దెప్పుడు? బ్రహ్మరాణికిన్.

ఉ. "జాతకచర్య"యందు గురుసంతతిఁ జెప్పెడుపట్ల వీరివి
ఖ్యాతిని విస్తరించితిని నక్కడఁజూపఁగలాఁడ, విందులోఁ
బాతకహారి తచ్చరిత పాఠము నీకును, నాకు, బావకుం
బ్రాఁతదోసంఘులన్ దొలిచి భద్రములన్ గలిగింప నెత్తితిన్.

శా. ఏనేకాదు మఱొక్క శిష్యుఁడును మాయీసద్గురుబ్రహ్మవి
ద్యానాథుల్ సురభాషలోఁ దెలిపి కార్తఘ్న్యాఘభారాపహో
ధీనానూనవచస్కృతుల్ బరఁగెఁ దద్దివ్యద్వచోధార, ని
త్యానందాత్ముఁడు, మద్గురూత్తముఁడు నిన్నత్యంతముల్ బ్రోచుతన్.

ఉ. ఎంతటి పాపమేని రచియించును గాక, కృతఘ్నుఁడై ఋజూ
స్వాంతు గురూత్తముల్ దెగడి వర్తిలుఁగా, కలచర్ల బ్రహ్మవా
క్కాంతుచరిత్రముల్ జదివి కాఁగలఁ డుత్తముఁడంచు నెంచు మ
త్స్వాంతము; తచ్చరిత్రము కృతఘ్నుఁ గృతజ్ఞు నొనర్పఁజాలదో!

క. ఆచరిత వ్రాసి నతఁడును నా చినతండ్రికొమరుఁడును నాకడఁ,దిర్ప
త్యాచార్యు నొద్ద శిష్యత, నోఁచి పిదప బ్రహ్మసేవనోఁచి రెఱుఁగుమీ!

క. కాననతండు సతీర్థ్యుఁడు, మా నిజశిష్యుండు నగుట మాకడ కల * బ్ర
హ్మానూన చరిత నంపెను, దీనిని ముద్రింపుఁడని విధేయత కలిమిన్.

చ. అలచరితంబు నీకు శుభమాపని కెంతయుఁ జాలునంచు ని
మ్ములఁ గొని కొంత యియ్యెడల ముద్రితముం బొనరించువాఁడ; యో
గ్యులు గురుపట్ల నిట్లనుమి కొందఱు శిష్యులు వ్రాయువ్రాఁత; లే
ఖిలుఁడును పాడువ్రాఁతలకు గా దగఁ డంచిది చెప్ప నొప్పగన్. 130

---

* శ్రీచర్ల బ్రహ్మగురువరచరిత్ర సంగ్రహము.

...శ్లో॥ విద్యావాసగృహం పరోపకరణోత్పత్తిస్థలం సత్కృపా। పణ్యం పుంజిత సత్త్వ మున్నతయశఃకాయం ప్రతిష్ఠాలయం। రాజత్సద్గుణరత్నరోహణ గిరిం ధర్మస్వరూప మ్ముదా। విద్వద్బృందవతంస మాత్మనిభజే బ్రహ్మాఖ్యవిద్యా గురుం॥ ...శ్లో॥ గోదావరీమండలరాజమానో సీలర్షభగ్రామవర (కటిరెడ్డు) శ్చకాస్తి। ఆరాచ్ఛ విద్యాధరతీర్థవర్యా, ద్యత్రా విరాసీ ద్భగవాన్ కుమారః॥ శ్లో॥ ద్విజస్తస్మి న్నేకో వస దుపవనద్రావిడవరః। ప్రసిద్ధో వీరాఖ్యో జనిము పగతో లోహితకులే। లసచ్ఛ్రీగోపాఖ్యో నియమితమనా స్సంచ్ఛుచిరపి। హరి ద్వాలోకేకుర్వ న్నినకరసతీ ర్భక్తికలితః॥ శ్లో॥ ప్రాణాంభోనిధిరంధ్రవారిధిమితే ష్వబ్దే ష్వతీతేషు స। త్స్వేకల్యాదిచ శాలివాహనశకే షట్ఛాస్త్రసూనీందుషు క్రోధ్యబ్దేచసహస్యమాస్యథవశే పక్షే తృతీయే తిథౌ। జజ్ఞే తస్య చతుర్థసూను రిహచా మత్రార్థసంసాధకః॥ శ్లో॥ ధాత్రీణా ముపబృంహణా దుతలస

ధర్మస్యపుణ్యస్యవా। విద్యాయాః అథవా నచే దధిగతబ్రహ్మైకభావస్థితేః।
యద్వాఽశేషజనోపకారక కలాశాలాది నిర్మాణతో। బ్రహ్మేత్యుత్తమనామ
సార్థకతయా పిత్రాఽస్య నిర్ధారితం॥ ...శ్లో॥ వారాణసీం। జగమిషుః పరిశిష్ట
శాస్త్రః। పాఠాయ భూసురవరస్య గురోరనుజ్ఞాం। లబ్ధ్వాతికౌతుకయుత స్తదను
ప్రతస్థే। పౌరైస్సతీర్థ్యనివహైరపిభుజ్యమానః॥ ......శ్లో॥ కాశీనాథబుధో
హి యద్గురువరః కాశ్యాంవశిష్ఠాయితో। యచ్ఛిష్య స్సకలార్థవిద్గురుయశాః శ్రీ
బాలశాస్త్రీ మహాన్। ఏవం శ్రీహరిశాస్త్రిణ్య నుత్తమగుణో వాక్యార్థచాన్ద్రీకరః।
కాశ్యాంభూపనిషేవితో వ్యజయత శ్రీరాజరామో బుధః॥ ...శ్లో॥ ఇతి షోడశ
వాసరా నుషిత్వా। నిజగేహే స్వవివాహసంభ్రమేణ। నిజ
సోదర దుర్గపండితేన ప్రతిగన్తుం ఖలు నిశ్చికాయకాశీం॥
...శ్లో॥ షట్సుచ్ఛాస్త్రేషు షడంగేషు షడ్భాషా షణ్మతేషుచ। ప్రజ్ఞా యస్యస్థితా
తస్మై బ్రహ్మంతర్వాణయే నమః॥ ... శ్లో॥ ఇత్థ మేవన్నృపసన్నిధౌ బుధైః।
శ్శాస్త్రీషద్గవపరీక్షితో భవన్। శ్లాఘితో బహుమతస్సభాస్థలే। నిర్జగామ బుధ
నిర్జయాయ సః॥ ... శ్లో॥ దూరేణ కాలనియమేన బహుద్విజానాం। కోలా
హలేన నియతాశనభోజనేన సత్రేషు భుక్తి రధికశ్రమకారిణీతి। జ్ఞాత్వైవహి
శిష్యనివహాయ దదాతిచాన్నమ్॥ శ్లో॥ ఇతి జగదుపకారస్య। ప్రతిపద మఖిలైస్తు
నుత్యమానస్య। పరిణామశూల బాధాఽపరిణతవయసోఽపి దేశసంచారాత్॥
...శ్లో॥ శనకైరగమద్విద్వాంత్స్వగ్రామం "సుకడియద్ధ" నామానం। శ్రీరామో
వనవాసా। దివ సాకేతంన్నృణాం ప్రమోదేన॥ ... శ్లో॥ స్వస్యాలకః పఠితు
మారభతాఽగమం యః। శ్శాస్త్రాణి పాఠయతి శిష్యగణం స్వపశ్చాత్। విద్యార్థి
తాం తిరుపతిః కవివేంకటేశో। యాతౌచ యౌ కవితయా గురుకీర్తిసాన్ద్రౌ॥
...శ్లో॥ న కేవలం ఛాత్రగణాయ భోజనం। దదాతి పాంథావళయేచ సన్తతం।
తత స్తదీయం సదనం సమీర్యతే। న పాకశాలేతిన సత్ర మిత్యపి॥ శ్లో॥ రాత్రౌ
త్రిహోరాసమయే ప్రబుద్ధః। క్రమేణశిష్యానఖిలా న్ప్రబోధ్య। శాస్త్రాణి
సంపాఠయితుం ప్రవృత్తో। స్సమాపయేద్ద్వాదశ ఘంటికాన్తే॥ శ్లో॥ చిత్రంకేచన
కావ్యనాటక మహాలంకారచమ్పూముఖ। గ్రన్థా న్వ్యాపకశిష్యవర్గ సవిధేసమ్యో
క్పఠన్తోఽనిశం। సాహిత్యప్రచు రాస్తత స్సవినయం బ్రహ్మాఖ్య సూర్యాన్తికే
శ్రీమద్వ్యాకృతి మధ్యగీషత కిమస్త్యస్మాత్క లాకాంక్షిణాం॥ శ్లో॥ యాదృక్షో
మగురో స్స్వశిష్యనివహే గుర్వ్యస్త తోప్యున్నతం, ఖ్యాతైః కిం సుతనిర్వి
శేషమపితౌ సంపశ్యతో జంపతీ, దూరే బంధుజనా న్విహాయ పితరౌ దేశంచ

విద్యార్థినాం, బాలానాం కిము సౌఖ్య మస్తి గురుసత్కారుణ్యతోఽన్యద్భువి॥ శ్లో॥ దానం కలావమృతసాధన మిత్యవోచన్, దానే ష్వనుత్తమమితిస్మృత మన్నదానం, ప్రత్యక్షభూతపరితృప్తి నిదానభూత, మిత్యన్వహం పరితనోత్యమి తాన్నదానమ్॥ శ్లో॥ నిస్స్వాననన్యగతికా నితరా న్ద్విజాతీ, న్విద్యార్థినశ్చ కృతదారపరిగ్రహాంత్స్వః। కాశ్యామివ ద్విజనిమస్కరితా ప్రదాన, లబ్ధాతిదోష హరణాయ కరోతి విద్వాన్॥ ... శ్లో॥ మధ్యే మధ్యే శేనచి ద్ధేతునాఽయం। భక్ష్యైర్భోజ్యై ర్లడ్డుకై రన్నదానం। భూదేవానాం సంభ్రమా త్సంతనోతి। ప్రాజ్ఞస్యాఽస్తే భూతతృప్తేః పరంకిమ్॥ శ్లో॥ చిత్రం ద్వాదశవాసరేషుమి లితాన్ గోదావరీ పుష్కర, స్నానార్థం ప్రతిపక్తి చోపదిశతో విప్రాం త్సహస్రాధికాన్, నాఽఽలోచ్య శ్రమమున్నతం ధన మయం సంపాద్య భక్ష్యా దిభి, స్సంతర్ప్య ధికపుణ్య మాప భువి కింవృష్టః క్వచిత్తత్సమః॥ ...శ్లో॥వికా రినామాఽ సువికాః కారీ, సమాగతష్షడ్గ్రహకూటతోఽబ్దః, పుణ్యోచ్చయం బ్రహ్మగురో రతీవాఽ, సహిష్ణునాజ్ఞప్త ఇవాబ్జజే॥ శ్లో॥ భూదేవాయుతతర్ప ణం దశదినై గ్గోపాదతీర్థోజ్వల, త్కొవ్వూరాఖ్యపురేఽ స్తిక ప్రపిలసచ్ఛ్రీ కోటిలింగస్థలే, క్షేత్రేపాదగయాహ్వయేఽపిచ నిజశ్వే తాద్రిపుర్యాం తథా. కర్తుం బ్రహ్మసుధీ రియేష జగతః క్షేమాయ కామాయచ॥ శ్లో॥ దశమ్యాం కృతార్ఘ స్తిథౌ బ్రహ్మవిద్వా। నుపక్రాన్తమస్త్రాదిశాన్తింసమాప్య, సుభుక్తేషు విప్రేషు పశ్యంత్సు తుష్యన్। పరిత్యజ్య దేహంగతో బ్రహ్మణైక్యం॥ శ్లో॥ ది వంగతే బ్రహ్మబుధేనరాఽ సీ త్స్వశబ్దహీనా బతధర్మశూన్యా, కలార్థివర్గో విఫలో బభూవ। క్షుధాతురః పాన్థగణ స్తదాఽసీత్॥ ... శ్లో॥ తతాన్వలః పతితాగమ న్స్నుణభా, క్క్రీ విశ్వనాథో బుధ। స్థిత్వా తత్రతదార్జితావనిఫలై ర్వర్షాశనై స్సత్కృతైః। విద్యార్థిప్రకరం యథాకథ మథో తత్పాఠశాలాగతం విద్యాబుద్ధియుతం కరోతిహి గురో ర్ధన్యత్వమాపాదయన్॥ శ్లో॥ వేమూర్య పాఖ్యనరసింహకృతం సభక్తి శ్రీబ్రహ్మపండితచరిత్రమిదం పవిత్రం, యావ న్దివాకర నిశాకరతారకాశ్రీ। స్తావ జ్జయే త్సుఖయుతా మనుజా భవేయుః॥ శ్రీ

మ॥ కలిమానం బోకయైదువే లరుగ నేకత్రిస్థపప్తగ్రహ, మ్మలకున్
శాంతి యొనర్చుచున్ శ్రమ లవమ్మున్ లేకయే బ్రహ్మమున్, గలిసెన్ బ్రహ్మ
గురూత్తముండు దశమిన్ గంజాప్తవారంబునన్, ఖలసంచారి వికారి కార్తిక
వళక్షు శ్రీకపక్షమ్మునన్.

తి॥ వెం॥

మ. గురుభక్తిన్ బరశుప్రచారనిరతక్షాత్రావనీపాలసం
హరణప్రాప్తయశోభిశోభి జమదగ్న్యాత్మోద్భవున్ దెల్పు నా
కరరే! యిట్టిఁడ వెట్లు శిష్యుఁ డయితో? యంతేవసద్ధర్మదు
ర్మరణోపజ్ఞదురుద్యమవ్యథితధీరవ్రాతచేతోంబుజా!

మ. గురుభక్తిప్రథితుల్ మహామహు లనేకుల్ సర్వలోకైకదు
స్తరవిస్తారిత నిస్తులైనసనితాంతధ్వాంతనిర్మూలనా
పరభాస్వత్ప్రభాస్ఫురుల్ వొలుచు నిక్కాలంబునన్ నాకు నీ
వరరే! శిష్యుఁడ వెట్టులైతివొ కదా, యాచార్యనిందావహా!

మ. ఒకఁడున్ గన్పడఁడిట్టి యీకలిని నీకో శిష్య! తుల్యుండు, పా
య కుపాధ్యాయునిఁ గొల్వకున్న నతఁ డత్యంతమ్ము పాపాత్ముఁ డం
చకటా, వ్రాసెడియంత సాహసి; మదీయాఘప్రభావంబె నిన్
వికలాత్ముం బొనరింపఁబోలును జుమీ, వేత్తృత్వసత్తాఖనీ!

శా. నీకున్ జిక్కిన యీకృతఘ్నతను నేనే నేర్పినట్లే తుదిన్
లోకుల్ వాకొనువార లేమొ? యని లోలోఁ జింత నేఁ గాంతు; వి
ద్యాకల్పద్రుము లస్మదీయగురు లేతన్నిందఁ రాకుండ నా
పాకం బేర్పడఁగా వచించి ననుఁ గాపాడన్ బ్రియత్నించుతన్.

ఉ. ఏకుటిలంపుఁ బాపములు నీయఘతుల్యము కావు; భారత
శ్లోకము లిట్లు చెప్పు, నవి సూరివరుల్ శిరసావహింత్రు; నా
శీకచరిత్రిలోఁ గను, మశీకము గాఁ దలపోయఁబోకు; మా
రా! కలికాలమేని యఘ మంత సహింతురె ధర్మచింతనుల్?

చ. గురుఁ డొకచో సహేతుకము కొండొకవేఁడిమి నూనుఁగాక కో
ప రసము తగ్గఁ జేయుట కుపాయము లుండవె? వానిమీసముల్
బెఱుకుట, వానిగ్రంథములు వెక్కిరిపించుట, 'వేరు' లౌటయున్
జరిగెనె యెన్నఁడేని? యొకఘాతుని నుదాహరణంబు చూపెదే?

ఉ. ఊరక యుండు నేని యఘ మూరక యుండదు నీకు బాధకం
బై గ్రహింపఁ బీడ వెట్టు, నది యస్మదభీష్టము గాద; యిప్పుడో
కారణ ముండి కాళ్లఁ బడఁగాఁ జను దేరక యుండుగాక నీ
మారచనన్ గుణించి మది దుఃఖము చెంది సుఖింతు వాపయిన్.

చ. ఎఱిఁగి యెఱుంగ కేయఘము నేని పొనర్చియుఁ బిమ్మటన్ జనుం
"డరరె! యఘంబు చేసితి" నటం చోకకొంత మదిన్ దపించి యు
త్తరమగు పాపమేనియును దాఁటఁగఁ జాలెడిఁ, బైకిఁ బాపమున్
బొరయుట తెల్పనేని సరిపోయె నిరాగసుఁ డాతఁ డంతతో.

ఉ. ఎన్నఁటికేని గాళ్లఁ బడుజే సదుపాయ, మఘంబు నాఁడె పో
సన్నగిలున్; గురున్ దెగడు సాహసమూని యెదో లిఖించి సం
పన్నగృహస్థులౌ జనులమన్ననఁ గైకొన, వెవ్వరో నినుం
"బన్నము బాగు బా" గనినఁ బాడను నోరికి వచ్చినట్లుగన్

ఉ. చెప్పెడివారు నీ కకట! శ్రేయము గూర్చెడివారు గారు; నా
చప్పనికూఁతలే తుదకు సద్గతిఁ జూపును నీకు; నూర్వ్యరా
విప్పుడు నిన్నుఁ గైకొనుటకేనియు నే నిడు చప్పకూఁతలే
తప్పక కారణంబునుమి! తప్పుడుత్రోవిఁక నేని వీడుమీ!



## (7) ఆ త్మ వై భ వ ప ర్వ ము

ఉ. నన్నును గారవించు నరనాథులు లే కొకసాకు పన్ని నీ
యున్నపదంబునం దెటులనో పడ నెంచితి నంచు నెంచ; కెం
దు న్నను గారవించు నృపతుల్ శత మన్నను లోక మొప్పు; నీ
వన్నను విశ్వసింపవలదా? యిలఁ దా సకలం బెఱుంగదా!

ఉ. అప్పనృపాలుఁ డింక నొకయబ్దములోఁ దన పోకె ఱింగి మేల్
చిప్పిల "శాస్త్రిగారి కేటు చేసితి వార్షిక మెల్లకాలముం
దప్పక యట్టులే యిడుఁడు నాకు ముదం బగు దానఁ జేసి" యం
చొప్పఁగఁ జెప్పె, నీ వెఱుఁగవో సుత! కోకిల వైతి వంతకే!

చ. ఎఱుఁగుదె యప్పరాయనృపు? నించుక యాతనిసొమ్ము కాకితోఁ
దిరిగెడునప్డు తింటి, వది తేనుపు వచ్చినయప్పుడైన న
న్నరపతి నన్నుఁ జూచెడు ఘనంబగు చూపు స్మరింపుమయ్య! త
త్పుడులు కుమారు లానృపువిధమ్మునఁ జూతురు నన్ను నేఁటికిన్.

తే. గీ. * ఆత్మకూరును గద్వాల యరయుచుండు
నామురాకకు నేఁటేట; నీమురూహ

---

* "మీరు ఈడిసెంబరులో నెంతత్వరగా రాఁగలిగిన నంతత్వరగావచ్చిన మా అందఱికి చాలా సంతోషము గలుగును......"

నూజివీడు, 16-4-11. నారయ్యప్పారావు

నీకు నుదయింపనేటికి నిన్నుఁ జెఱిపి
బాగు పడనేల యిందఱు ప్రభువులుండి?

మ. పనిగాఁ దా బెజవాడలో డిగినుమా ప్రార్థించె 'మున్నిచ్చు భూ
మిని బేర్మిం గొని తండ్రిగారి యశముఁ మెట్టెక్కఁగాఁ జేయుఁ' డం
చును శ్రీయాత్మకురుప్రజాధిపు తనూజుం; డాతనిం బోలు వా
నిని జూపింపుము నేఁటిరాజులను నెందే శిష్యచూడామణీ!

ఉ. ఇచ్చినభూమి పుచ్చుకొననేగని మాపయి నల్కఁ బూనకే
వచ్చి గ్రహింపుఁ డంచను నృపాలురు గూడను నేఁటి యీకలిఁ

## * TELEGRAMS.

"Starting Bezwada to-morrow morning 8-15 train come Bezwada"

Madras, 29th July 1911. Raja of Amarchinta.

"Atmakur Raja coming Bezvada to-morrow evening meet Positively." Cocanada, 19—7—11.

శ్రీరాజా సూరానేని వెంకట నారాయణరావు బహద్దరు జమీందారు పరగణే మయిలవరం వగయిరా దొరవారు దండం.

ఈనెల 19 తేదీని మయిలవరం గ్రామములో మీచే శతావధానము చేయించ దలచినాము. గనుక మీరున్నూ బ్ర॥ శ్రీ॥ తిర్పతిశాస్త్రిగారున్నూ మయిలవరం మకాముకు 18-4-11 తేదీకి రాకోరుతాను.

మైలవరం
7-4-11,

R. S. V. Narayana Rao,
Bahaddar.

శ్రీరాజా వెల్లంకి చినవెంకటరామారావు బహద్దరు జమీందారు ఆఫ్ నడిమితిరువూరు అండ్ వినగడప వగైరా యస్టేట్సు దొరవారు దండము.

......అప్పుడు శతావధానము కూడా మీవలన చేయించవలెనని వున్నది. మేము 1 డిశంబరుకె బందరు చేరుచున్నాము......వెంటనే జవాబు వ్రాయింపవలెను.

31-11-1912
మదరాసు

Raja Vellanky China Venkata
Rama Rao Bahaddar

గ్రిచ్చుట నుండిరే? యశముగాక మఱొక్కటి నిల్వఁ బోదు; త
త్సచ్చరితంబు శాశ్వతము దానము మే మది పట్టుకుండినన్.

ఉ. గుంటురి పోరుహేతువునఁ గోరిన యానరపాలుఁ జూడఁ బో
కుంటిమి; యానృపాలమణి యొండొక సైఁచునుగాక మమ్ము; "హు"
ష్షంట మరెవ్వరో నుడువుమయ్య? భవన్నరపాలుఁ డొక్కొ? యా
దంటయు నొప్పఁ డీనుడికిఁ దజ్జ్ఞుఁడు యోగ్యుఁడు నే నెఱుంగుదున్.

ఉ. ఆయనయొద్ద సెక్రటెరి యత్యమలుం డతఁడేని యిట్లుగాఁ
గాయునెడస్ సహింపఁ, డలకోవిదుదర్శన మాయె నాకు, బల్
ధీయుతుఁ డం చెఱింగితి; విధేయుఁ డతండును 'హుష్షు' పల్కఁడో
హో! యెవ రాడకుండినను 'హుష్షు' జనించె భవన్ముఖంబునన్.

క. గుంటురి గుంటల ప్రాఁతలు, గంటిని బల్కితి నటంచుఁ గ్రమ్మఱొనెదొ? య
ప్పంటికి గుంటురి గొంటరి, జంటలు జనియింపమిన్ బోసంగ దది సుతా!

తే. గీ. ఇంకెవరు 'హు' ష్షనిరో పేరినెత్తితెల్పు
మల్లవారినె మెప్పించి యడఁతు నీదు
తప్పుడుపరిసంగమును; వృథా మొప్పెవగుచుఁ
బాడువ్రాఁతలు గిల్కెదే భయము విడిచి.

శా. * సన్యాసుల్ మొదలెల్లరాజులు ననున్ సారజ్ఞుఁగా నెంచి శ్వే
ర్మి న్నామాటలయందు నించి యనువర్తింతు గ్గురున్ బోలె 'హు'

---

Madras, 24-10-12

(శ్రీరాజా నడిమితిరువూరు అండ్ వినగడప వగ్గైరాయస్టేట్సు దొరగారి వద్దనుండి)

......శతావధానముకూడా చేయించుచున్నాము ...... 6, 7 తేదీలకు తమరు బందరు మకాములో వుండుటకు ప్రార్థించుచున్నాము ...... మీ జాబుకు యెదురుచూచుచున్నాము. చిత్తగించవలయును.

శ్రీమత్పర దేవతా ప్రసాదోస్తు.

క. *దేవీ భాగవతాంబుధి, భావామృతము న్మథించి భక్తవరుల సం
భావించు మీదుచరితము, పావనమై దచ్చికడలఁ బ్రఖ్యాతి గనున్.

గీ. చక్కెర మెక్కెడి చలిచీమ వడువునఁ, దీపినీటి కెమ్ము చేఁపపగిది
భాగవతామృత పానసంసక్తిమైఁ, దనివి చనదదేమి దాహమహిమొ.

(పరమ శివేంద్రసరస్వతి) జ్ఞానానందుఁడు

ష న్నా! యెవ్వరినోట వచ్చినదో నా కామాట వాక్రుచ్చు, వా
ర న్నేనే చని యడ్డెదన్ ఘనుఁడో? సూరిశ్రేష్ఠుఁడో? భ్రష్టుఁడో?

ఉ. భ్రష్టుఁడు వల్కెనేని యలవానికి వందనముల్ ఘటింతు; ను
త్కృష్టుఁ డెవండుగాని చని కేల్మొగిపింతు; వృథాగ నెందు కీ
ముష్టిప్రసంగ? మారవుర, మూర్ఖత యెంతకు వచ్చెఁ! దిర్వతి
సృష్టి నెదుర్పలేక పెలుచన్ గుఱుచల్ లిఖియింతువే, సుతా!

మ. ఘనతేజుండు దివాకరుం డనఁ * కృతఘ్నఘ్నుండు తద్దేవు పే
రున నెవ్వానికులం బిలన్ వెలసె సారూప్యస్థితిన్ వానితోఁ
బెనఁగన్ జాలు కృతఘ్ను లుండు నెడ రేపే వచ్చి సాక్షాద్విరో
చను నోడించుఁ దమస్సమూహ జలదస్వర్భాను కేతు ప్రభల్.

మ. ఎవరీ 'హు' ష్షనువారు? నీ వెఱుఁగుచో నేర్పాటుగాఁ జెప్పు, వా
రవనీపాలురొ? మంత్రిసత్తములొ? లోకాలోకపర్యంతభూ
భువనవ్యావృతదివ్యకీర్తికలనాస్ఫూర్తిన్ విడంబించు వా
రెవరేనిన్ జని వారిమెచ్చు గొని నీ యీవాక్కు బంధించెదన్.

మ. ఎవ రా '' వాసియు వన్నెయున్ గలుగువా, రెందుండువా, రెట్టివై
భవ మొప్పారెడువార, లేమతమునన్ బద్ధాదరుల్? చెప్పు నీ
కవనమ్మున్ గురుభక్తియున్ మిగుల శ్లాఘాపాత్ర మం చెంచి న
న్నవమానింపఁగ "హుష్షు హు" ష్షనిరొకో? యంతేవసద్ధూర్వహా.

శా. భావత్కప్రతిభం గనుంగొని భవద్వాణిన్ విలోకించి నీ
భావంబున్ సరిగా గ్రహించినయెడన్ బల్కుం డొరున్ "హుష్షు"; నీ
చేవల్ సూచిన వాని కింకొకనిపైఁ జీకాకునుం బుట్టునే?
దేవానాంప్రియతాఖనీ? గురుని నిందింతే యసత్యోక్తులన్.

మ. ఒకసందర్భముఁ జూచినన్ సకలమున్ యోజింపఁగా వచ్చు నీ
యః లంకత్వము వేఱె చెప్పవలెనే! యీయీ దురుద్యోగమే
ప్రకటించున్, బునరుక్తి కాస్పదుఁడవై వర్ణించుచోఁ, 'జె ప్పేకం,
డొకఁడో? సిద్ధి' యటన్న సామెత సుమీ యూహించుకో' మ్మాత్మలో

* (శ్రీమద్రామాయణములోని ఆదిత్య హృదయమునుండి.)

శ్లో॥ కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః




# ఆత్మవైభవపర్వము

చ. 'గురుఁ డెటువంటివాఁడు? గుణకోటియెడన్, జరితంబుపట్ల, శాం
కరి! నను నెట్టివానిఁగను గన్గొన నేర్చితి? తచ్చరిత్రముల్
బరిపరి నాచరిత్రమును బట్టి వచింపు' మటన్న స్వప్నమం
దరయఁగఁ జేయుఁ నంబిక యథార్థ మటుల్ భజియింపు విశ్వరిన్.

ఉ. ఆపె వచించు సర్వమును, నాయమ కెందును లేదు గోప్య, మే
పాపము నెట్టి పుణ్యమును బాలన చేసెడి తల్లి "హుష్ష" దా
నీపయి నుంచునో? నిను గణింపక నాపయి నుంచునో? వృథా
లాపము లూడ్చి కన్గొనుము లక్ష్యము తప్పక శాల్వ మంబికన్.

క. గురుశిష్యధర్మముల శం, కరుకతనన్ వినియె నాపె స్కాందమునం ది
త్తెఱఁగు కనంబడు నీకున్, దరణోపాయంబు చూపఁ దగు నాపె సుతా!

క. ఔరా! నను హుష్షని నీ, సారాచారములు మెచ్చు జనులుం గలరో
క్కో? రమ్మురమ్మ పోవుద, మేరాజస్య కడ కేని యిది తేటపడున్.

ఉ. మూల ముడింగి సారెకును ముష్టిప్రసంగము నీవు బాపయున్
జాల లిఖింప వచ్చు, నెకసక్కెము లాడఁగ వచ్చుఁగాక, టా
ట్టొ లెటు సాగు వేరొకయెడన్? బొనరించినలోపముల్, వృథా
పేలిలుటలున్ శిరమ్మునకు వ్రేఁగు ఘటింపక యూడఁబోవునే.

ఉ. ఎన్నిటినేనిఁ గప్పు జగదీడ్యతరం బగుశక్తి, యట్టిదే
యున్నయెడన్ గురుం దెగడి యున్నతిఁ గోరఁగ నేల? కీర్తికిన్
దిన్ననిత్రోవయే కలదు, దేవుఁడు దాని నొసంగకుంటయే
యున్నిదొసంగు లిక్కరణి నీవొనరించునిమిత్త మర్భకా! 163

శా. పాపంబుల్ పలురీతు, లందెదియొ యెప్పాటన్ మనుష్యుండు తా
మాపో రేపొ యొనర్పకుండుట యసంభావ్యంబు; నేఁ డన్న, హా
లాపానాదులు సైతమున్ ఘనులె హేలన్ జేయుచున్నారు నీ
వాపాదించు కృతఘ్నతాభరమొ? త్యాజ్యంబౌఁ జుమీ యేరికిన్.

ఉ. దీనిమహత్త్వమున్ దెలిపి తిన్నని త్రోవను బెట్టకున్నచో
హీనునిగాఁగ నన్ విబుధు లెంతురు, నీకును లేదు ముక్తి; డెం
దానఁ బునఃపునర్మనన నాగురుతన్ గుణిచేసి చేసి వ్యా
ఖ్యాస మొనర్చి తిన్నఁబడి కైకొనుమయ్య కుమార! భద్రముల్

క. నినుఁ జెఱుప నెంచినఁ జ, న్నను * 'నేదో'కవి, యటంచునుం దిట్టినజా
బును కేనియెద్ది కంపినఁ, బనుపడదే, నాదుకోర్కె బ్రహ్మాండంబే? 166

---

పల్లెపాలెము.

* "శ్రీగంగాభాగీరథీసమానులకు... రావుగార్కి. నీవు వెంకటరామ కృష్ణకవులకును తిర్పతి వెం + కవులకును తంత్రము పెట్టినట్లు విన్నాను నీకు అందువల్ల వెం + కయైనను లాభములేదు. ...నా పేరు వ్రాయక పోవుట మరచి వ్రాయలేదు. '(బూతుమాటలతో చేవ్రాలు)

ఇందు చేవ్రాలు మాలమాదిగలుకూడ నుచ్చరింపని బూతుమాటతో వ్రాయుటట్లుండ నిది యెవరినుద్దేశించి వ్రాయఁబడినదో వారిని దిట్టిన తిట్లకుఁ బరిమితిలేదు. మఱియు నీయుత్తరము కాని కార్డుపై వ్రాయఁబడినది. మొదట పెనిసిలుతో వ్రాసినపిదప వేఱొక సిరాతో దిద్దఁబడియున్నది— ఇఁక నొకమాదిరి సిరాతోఁగూడ నొక క్రాముడియుఁ గొమ్మును సవరింపఁడి మొత్తము మూడు వ్రాత లుపయోగింపఁ బడినవి. కార్డుపైని అడ్రెస్సు మ॥ రా॥ రా॥ అని యున్నది. లోపల వేరువిధముగా నున్నది. బూతుపేరితోఁ జేసిన వ్రాలు కార్డుపైనిగూడ పెన్సిలుతో వ్రాసినది కలదు మఱియు నిట్టిదే వేఱొక యుత్తరముగూడ నిట్టి చేవ్రాలుతో నీయన నుద్దేశించియే వ్రాసినది కలదు. విషయభేదము లేదు గాని యందలి యంశములు మఱియుం బచ్చిగానున్నవి. ఇందు రెండుబొమ్మలు వ్రాయఁబడియున్నవి. ఎన్నో బూతు లనేకవిధముల ససందర్భములుగా లిఖింపఁబడి యున్నవి. అవియేవియు నిందుదాహరించుటకు రాజశాసన మొప్పదు కాని యందుఁ దుట్టదుదను వ్రాసిన తప్పుడు సీసపద్యముమాత్ర ముదాహరణయోగ్యముగా నున్నది.

"సీ॥ పురుషుండవో కలిపురుషుండవోకాని ధూమకేతువుతోడ తుల్యమగుచు భయమొకింతనులేక నిర్భయంబుగ నీవు గ్రామమృగరాజుతో తుల్యమగుచు, నీపలుకును దాని పలుకొక్కటియె కాని కూయదెప్డు డొక్కసారిగాని
తే॥ గీ॥ యిట్టి నీ దుష్టచరితంబు యింపుమీర, వ్రాసినాడను నేను వహ్వాయనగ.

చింతగింజపలెను.

యు. మిస్టరు. (అవాచ్యపు చేవ్రాలు)

యీపత్రికలు యితరులకుకూడా పంపినాను.

ఉ. "ఎప్పటికేని నీవచటనే సుఖముందువుగాక, నాదుపే
ర్చెప్పకయుండినన్ నృపతిచే వినిపించెదఁగాక; నీదు వా
తప్పదు పేరు లీశతవధానమునుండి మరల్తుఁగాక" యం
చిప్పనిఁ బూనితిన్ జరిగె నిన్నియు నొక్కటి తప్పకుండఁగన్.

ఉ. ఇప్పటికేని నీయెడలనే దయ నా కధికంబు, నీదు వా
తప్పుఁబ్రసంగ మంతగ నెదన్ జెదరింపదు, నీవు పెట్టువా

పై యుత్తరములు వ్రాయువారు వ్రాయించువారు వీనియం దుద్దేశింపఁబడినవారును జాల దగ్గఱబంధువులు. మాశిష్యులొనర్చెడి యసందర్భ ప్రసంగమును విని మందలించినందులకై వారివంకనుండి యిట్టి యుత్తరములు వెలువడఁజొచ్చినవి. వీనికి సంబంధించిన రికార్డు సర్వమును మావద్దనున్నది. ఇటీవల నీయవాచ్యపు టుత్తరములంగూర్చి బంధుసముద్రులు కొందరుచేరి మందలింపఁగా జరిగినయంశము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

..."ఈమధ్య వెంకట్రామయ్య యిచ్చోటికి వచ్చినాడు. అప్పుడు యీయుత్తరము నాకు వచ్చినట్లు ప్రసంగవశమున వచ్చినది. ......వెంకట్రామయ్య తమ్ముడు సత్యనారాయణ ఎరుగక వ్రాసినట్లు దక్షిణామూర్తిన్ మొదలగు వారియొద్దను అన్నాడట. ......దగ్గరబంధుత్వకారణమున నేమియుదలచక మాటలాడక యున్నారము. పాపపుణ్యములు భగవంతునకే యెరుక. ...మా మీద లేనిపోని మాటలాపాదించి ఎవరు వ్రాస్తే వారే యనుభవింతురని...... యూరకున్నారము... వెంకట్రామయ్య తమ్ముడు మాత్రము "మా అన్నయ్య వ్రాయుమంటే నేను వ్రాసినా"నని అక్కడక్కడ అంటున్నాడు. (చేవ్రాలు)

☞ దీనితరువాయినిగూడఁ గొన్నిపంక్తు లీక్రిందవి వ్రాయఁబడినవి.

"వెంకట్రామయ్య తమ్ముడు సత్యము అక్కడక్కడ మా అన్నయ్య వ్రాయమన్నాడు గనుక ... రావున కుత్తరములు వ్రాసినానని చెప్పడముచేత వెంకట్రామయ్యయే వ్రాసినాడేమో యని నేతలచి మొదట మీవిరోధములు నామీదకు కూడా వచ్చినవి యని మీ పేర వ్రాసినాను."

☞ శ్లో॥ కర్తాకారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః। అను నార్యోక్తింబట్టి పైయుత్తరములలోని సంగతి సందర్భములను బట్టియుఁ బ్రాజ్ఞులు విచారించి మాశిష్యుఁడుగారి గురుభక్తిని నిర్ణయింతురుగాక. ఇతఁడు చెప్పి వ్రాయిం

తప్పుడుఁ జేరు లాశతధానము పేరును మాపుచుంటి నా
ముప్పు నడంచుపొంటె నిది పూనితి నిక్కము నమ్ము నర్భకా.

ఉ. పూనిన పూనికన్ దెలిసి "పొట్టకుఁ బూనితి సైఁపుఁడంచు నా
పై నెనరుంచుఁ డంచు నొకపాటిది యుత్తర మంపితోక, దు
ర్మానపుఁ ద్రోవఁ ద్రొక్కి యపరాధము పెంపొనరించి కొంటి; వి
ద్దైనియు మంచిత్రోవఁ బడు మింక పరాధివి కాకు నాకులన్.

ఉ. ఛాత్రత దాఁచి వేఱొక యసహ్యపు మార్గముఁబట్టి పూర్తిగా
శతుత్రి వెళ్లఁబెట్టియుఁ బ్రసక్తికిఁ గాని ప్రసక్తిగా గురు
స్తోత్రము లన్యథా సలుపఁ జూచెద, వింతటిలోనె నాయశ
స్సత్రి మపాత్రమాసె? పలుసజ్జను లుండఁ గవీంద్రు లుండఁగన్.

మ. 'అవధానం బొనరింప లేఁ డతఁడు, నాయాచార్యుఁడుం గాఁ' డటం
చవనిన్ మెచ్చఁగఁ జేయలేవు విను మబ్బా! "తప్పు సైరింపుఁడీ
యవివేకం బొనరించినాఁడ" నన నార్యస్తోమముల్ మెచ్చు "మ
ల్లి వెలార్పంగను నొజ్జు గొట్టికొనుటల్" లోకుల్ ప్రశంసింతురే.

కం. "దాసునితప్పులు దండము, తో సరి"; నామాట వినుము తుచ్ఛపుఁ వ్రాఁతల్
వ్రాసి కలహమ్ముఁ బెంచకు, మోసుత! బుధ * లాడుమాటలూఁకొనవకట

ఉ. గుట్టును మట్టునున్ దెలియ కోయిలపిట్టవు గాన నా యెడన్
జెట్ట యటన్న నిశ్చయముఁ జేకుటె నీకుఁ గుమార! నాకడన్
జుట్టమొ, దైవమో యనిన చూపున నున్న నృపాలు రెందఱో
పట్టణసీమలం గలరు పల్లెలయందుఁ గలారు పుత్రకా! 173

---

చినచోఁ నడుగ సేయక్కర లేదు. తనంతటఁ దానే యీతనితప్పుఁడు వ్రాసి నచోఁ దప్పునింబట్టి యన్నగారి వివేక మనుమేయముకాక మానదు. ఆయీ పోకలయందలి యోగ్యతను గూర్చి భగవంతుఁడును దత్తుల్యులగు యోగ్యులును విమర్శింపఁదగువారు.

* బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారి సన్నిధికి. (నవరత్నమాల)

చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీతిలకుల్ విలసచ్ఛతావధా। నరతిదలిర్పనై
కనరనాథ సభాస్థలులన్ జయంబుగాం। చిర వరకీర్తి దిక్తటులఁజెంది సముజ్జ్వల

ఉ. అందఱుఁగూడ మూర్ఖు లని యాడిరి, వేగతి నోరు వచ్చెనో
వందలు వేలు పండితులు పత్రిక లిచ్చిరి; యిందు నొక్కఁడున్
మందుఁడు గాని పండితుఁడు మంచి వివేకి యెసంగఁ డొక్కొ ? నీ
చందముఁ జూచినన్ దెలియు సాహసి వం చెటువంటి పందకున్.

---

చంద్రికాపరి! స్ఫురణముఁజూపఁ బండితులు భూరిముదంబున సన్నుతింపఁగన్॥ ఉ॥ ఆరయ సర్వశాస్త్రములయందు నుదంచితమైన సాహితీ। ధోరణి మేలుమే లని బుధుల్గొనియాడఁ గవిత్వవిద్య కా। ధారము వీరలే యనఁగఁ దద్దయు మించు పొగడ్తగాంచి యా। ధీరు లుదారభావమున దీపితులై విలసిల్లుచుండఁగన్. ఉ॥ వేంకటరామకృష్ణు లను పిన్న కవీంద్రులు నేఁడు వారికిన్। వంకలఁబెట్టి వారల ప్రబంధములందు విమర్శనంబునాఁ। గొంకక వ్యర్థలోపములు గూర్చుట తాతకు దగ్గునేర్పులై। యింకిటఁ బండితోత్తములకెల్లను గర్వముగాఁగఁ దోఁచెడున్॥ ఉ॥ పిన్నలువారు పైకొను కవిత్వమదంబున బద్ధులేమివా। కొన్నసు రాజబాట గొని కుంజరమేగ మృగంబులెన్నియో;। వెన్నడిమూసినన్ బరువు వీడ్కొనునో కరికంచు మెంచి లో। నెన్నక వీరలయ్యది యుపేక్షయొనర్చుట మేలు సూడఁగన్... ఉ॥ వేంకటరామకృష్ణయకవి ప్రవరుల్ ! వినుఁడీరు సత్కవీ। సంకలితుల్ కవిత్వసరసజ్ఞులునం చెతఁగించు మీరు ప। ద్యాంకములం గనుంగొనిన నద్భుతలీల శతావధానమా। తంకములేక చేసిన విధంబును దెల్లము సేయు మీకృతుల్॥ ఉ॥ ఐనను మీకళావిభవ మంచిత చారుకవిత్వ శక్తియున్। ధీనిధులంచుఁ గీర్తిగను తిర్పతి వెంకట సత్కవీంద్రులన్। మానక నిందఁజేసెడి క్రమంబునకున్ బనిపూనినట్టుగాఁ। గానఁగనయ్యెడున్ దగవుగాదిది పండితులైనవారికిన్॥ ఉ॥ పిన్నలు మీరు వారు కడుఁ బెద్దలు విద్యలకున్ బొగడ్తకున్। వన్నియగాదు మీకుఁ బెడవాదము వారలతోడఁ బూన; మీ। కున్న కవిత్వశక్తి బుధులొప్పఁ బ్రబంధములందుఁ జూపుఁడీ। చిన్నతనంపుచేతలు రుచించవు మీకపకీర్తి దెచ్చెడున్॥ చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీమణులార ! యనేక రాట్సభాం। తరముల మీరుగాంచిన యుదారయశంబున కిప్పు డిట్టిదె। వ్వరు విలపించినన్ గొదవవచ్చునె సూర్యుని జేటగప్పినన్ గురువగు తత్ప్రకాశమునకుం గొఱవచ్చునె కాన మీరు బం। ధురమగు శాంతిభావమున నూల్కొని యెప్పటి యట్ల యుండుఁడీ॥

ఇట్లు

అడవి సాంబశివకవి.

ఉ. 'కాకవు లెల్లఁ గాకవికిఁ గాలికి మువ్వనుగట్టి' రంటివే !
యేకముగా జగమ్ము లివి యెల్లను మ్రింగెడి నీదుబావ "ము
క్కాకలుదీరినట్టి కవిగండనిగా" నెటు సెప్పి నోట? నీ
కాకవిఁ గూర్చి, తాను నొక కాకవియో, కపియో, పికంబొకో?

చ. "భయపడ కేను రా" ననుచుఁ బల్కితి జ్ఞ  యొకింత లేద! యా
శయమునఁ జూచికొ మ్మొకట స్వాంతము మండి పిఠాపురంబు నా

"...తే॥ గీ॥ అట్టిమీయొద్ద విద్యల నభ్యసించి, కయిత మల్లంగ నేర్పును గాంచి తుదకు, మీరుగురువులు కారనిమిమ్మఁ దెగడు, ననుఁగుశిష్యులు గలరని యనఁ గవింటి. క. వారలదెసఁ గోపింపక, తారూరక యుండవేఁడెదను గాకున్నన్ దారించుక కోపించిన, వారికి సేమంబుగాదు పండితులారా! ఉ. ధర్మన ముఖ్య లోకశతవధానశతాంగమ! దారిసూపఁగా, నిర్మలమైన మార్గమున నిన్నల తిర్పతి వేంకటేశ్వరుల్, గూర్మిని దేశదేశములఁ గ్రుమ్మరఁజేసిరి నేడునీదుదు, ష్కర్మమదేమొ యోర్చుచును గాకవులీర్ష్యఁగ దొల్లెదక్కటా. క. నీకుఁగల యశము సెడదిదె, కాకవులంబోలుఁదోలి ఘనతిర్పతి సు, శ్లోకుఁడును వేంకటేశుఁడు, సాఁకుచునున్నారు నిన్ను జయ మగు నీకున్. సూర్యభట్ల వైద్యనాథం.

............................ శ్లో॥ యేగిరతం ప్రతిదినం పఠంతి బుధాస్తుతాః, తే గురుద్రోహ పాపాత్ప్రి, విముచ్యంతే న సంశయః

ఇట్లు, రామనాగేశ్వర భక్తిరస ప్రధాన కీర్తన శతకత్రియ నిర్వచ ంధ్రరఘువంశ కావ్యకర్తయగు:— భమిడిపాటి అయ్యప్పశాస్త్రి, హెడ్ మాస్టరు,

మండపల్లి, లింగాలపోస్టు, కృష్ణాజిల్లా. 11-12-12

Injeram 6-8-10

"...ఉ॥ పూతచరిత్రులైన తమబోఁటిమహాకవులందు వ్యర్థపుం, జాతురి ...జా వాగ్వ్యయము, సల్పినచోఁ దమరెంతయో మహా, ఖ్యాతిని గాంతురంచు మదిఁగర్వముచే నిలఁగొందఱుందురా, నీతివిదూరులన్ గనిన నేరమటంచుఁ దలంచకుందురే. చ॥ కవులని పేరువెట్టికొని కాలముపుచ్చుచు నొక్కచో మహా కవులను ధిక్కరించుటయె కార్యమటంచుఁ దలంచువాఁడు కా, కవియగుఁగాని సత్కవికిఁ గాకవి నామ మదెట్లు చెల్లు స, త్కవులకు దీనలోపమది గల్గ దొకిం

దయకు నివాసమైనయెడఁ దత్త్వ మందవా? పాఱిపోవా? ని
శ్చయముగఁ దెల్పుమీ! ప్రతిన జార్చెద, వెంటనె వచ్చి తీరెదన్.

ఉ. చక్రముఁ బట్ట నే ననుచుఁ జక్రి ప్రతిజ్ఞయొనర్చియున్ దురా
పక్రమ నేఁగు దేర నది పార్థునుపేక్ష యటంచు నెంచి 'యీ
యక్రమ మెట్టునేత నన్నృతాత్ముఁడ నయ్యెద' నంచుఁ గొంకకే
చక్రము దాల్చె శౌరి, యది సాహస మిచ్చెడుఁ గాక నాకిటన్. 179

---

చుక యెంచి చూచినన్. గీ॥ గురువులనె వెక్కిరించెడు కుమతులింక, తల్లిదండ్రుల నేరీతిఁ దనుపగలరో, యహహ? వారల నేమనియనఁగవచ్చుఁ, గాలమాహాత్మ్యమనియెఱుంగ వలెఁగాక.

వెలువలి వీరశంకరమూర్తి, సా॥ చింతామణి.

మ॥ గురువే బ్రహ్మ, గురుండె విష్ణువను, వాక్యున్ దూలఁగాఁ బుచ్చియే తెరవో మాకమరెన్ గదా యనుచు నెంతే యుబ్బి తబ్బిబ్బుగా, సరసుల్ మెచ్చఁగ నెట్టులోఁ బరమదే చాయన్ బోసంగున్ బరా, త్పరుఁడెల్లారక యుండుఁ, దప్పని ననేతాదృక్షమే లేదు, మీ, రగయుండీ యిదెబోధనేతునని సత్యం బెల్లఁ జాటింమ మీ, గురుశిష్య క్రమబోధి గీరతము నాకున్ బంపుఁడీ యొండు......

ది 4-3-1911

శిష్టా వెంకటసుబ్బశాస్త్రి
పొన్నూరు పోస్టు, గరికిపాడు

క॥ శ్రీ తిరుపతి వేంకటకవి, నేతలకు జగత్ప్రసిద్ధనిరుపమనిత్య, ఖ్యాతి శ్రీవృతులకుఁ గరు, ణాతత్పరులకు విపక్షనాగహరులకున్. గీ॥ అస్మదీయభోగేశ మాహాత్మ్యమందు, గురుమణీమాలలో మిమ్ముఁ గూర్చుకొనెడి, వైభవము పట్టకున్నను వ్యాకరణము, గలపి ముం దేని సద్దాని గరుణ నిడరె. గీ॥ వాయస వ్యాసముఖమున వారెకృష్ణ, పక్షితకునొప్పికొనినట్లు స్పష్టమగుటఁ గోకిలలకు రామాభిఖ్య కూడ దనుట, వారె కాకములుగను గావలసియుండు.... సీ॥ కాకంబు పేరిడి గ్రంథంబుముందుగాఁ గష్టించి చేసిన కారణమున, 'పాపీ చిరాయుః' వన్వాక్యానుగతిఁ జిరజీవితకు గురుదూషించుకతన, పులిఁజూచినక్క" యనొప్పల్కినే తద్వాచ్యబాధక నామము ల్వదలుకొనుట, బలివేయువిభువీశి బయలెక్కినను తలఁచ్ దక్కువమనకని తారియుంటఁ గీ. గాకవీట్పద పట్టాభిషేకమునకుఁ

మ. అవధానం బొకమూల నుంచు మది యేలా, చక్కఁగాఁ బద్యమున్
జవిగాఁ గూర్చి పఠింపఁ జాలుదువె? నీచాతుర్యమున్ జాతు మీ
యుపనీశుం డయిదే నిమేషములు నా కర్పించుఁగా, కా దినం
బెవియున్ జూడక వీడకే నిలుచున ట్లేఁ జేసి మెప్పించెదన్. 180

చ. అయిదునిమేషముల్ "టయిము" నర్పణఁ జేసియు నైదు యామముల్,
పయి నెల లైదు, పిమ్మటను వత్సరముల్ మఱియైదు నిచ్చి "మీ
దయ" యనిపించుకోఁదగిన దార్ఢ్యము మద్గురుపర్యు లిచ్చి; రీ
మెయి నది చూపఁ గాకము ప్రమేయము గల్గిన నోపికన్ బికా. 181

చ. వెనుకటిపోల్కెఁ గాక మిది వృద్ధగుటం బని సేయ లేదటం
చనుకొనినాఁడ వో తనయ! యజ్ఞుఁడవై కద? కాక మంటి దా
నిని జిరజీవిగాఁ దెలుపు నిర్ణయముల్ విన వో క్కొ? యెప్పు డొ
క్కనియతినే కనంబడెడిఁ గాకము లోకమెఱుంగదే సుతా. 182

ఉ. "కాకము వచ్చె" నంచు నృపకాంతునితో వచియించు వాఁడవో!
లేక "బక" మ్మటందువో? మలీమసుఁ డందువో? ఱేఁడు దర్శనం
బీక యనాదరించు నటులే ఘటియింతువో? తత్సభాస్థలిన్
మూకత సంఘటించెదవో? మొఱ్ఱిక్కెదవో? మఱి యేమి చేసెదో. 183

ఒగిన వారలు వారలే తగరు మీరు పరభృతత్త్వంబు "సందర్భ పద్యములను, జెప్పి కొనుటకు ఫల మిదిసిద్ధమయ్యె.... గీ॥ మొదల శిష్యుగాఁ గొనుఁడని మొదలు పెట్టి తుదకు నే మేమొ చెప్పఁగాఁదొడఁగినట్టి, తప్పు సైరించి నాయెడ దయ నుంచి, వారితోఁ బోరు చాలించవలె క్షమించి. గీ॥ అహహా! యెవరెంత ఘనులైన నన్నత నాదు, లగుచు గురుశిష్య మర్యాద నంతరింపఁజేయఁగాఁ గూడదటువంటి శిష్యులేల? యున్నకీర్తికిఁ జోటు లేకున్నమీకు. గీ॥ ఎవరి పాటవ మెట్టిదో యెవ రెఱుంగ, రెందు కసములతో వాద మేమి ఫలము, పెనిచి విషవృక్ష మేనియుఁ దెఱుకరాదు, తమకుఁదెలియని ధర్మముల్ ధరణిఁగలవె. ఉ॥ గీరతపద్యవర్షములఁ గింకవి పంకజముల్ మునింగె గం, భీరవచోఘునధ్వనుల పెంపునకుం గవికేకిలోక మిం, పారఁగఁ దాండవించెను మహాత్మకదంబము లుల్లసిల్లె నా, భారత మేమిలెక్క యను భంగిని గీరతమున్ జెలంగెడిన్.

బందరుతాలూకా
పెడన.

సాధుజన చరణసేవకుఁడు
మల్లంపల్లి మల్లికార్జునుఁడు.

క. నాకంత నాదమును విని, కాకమె యనుకొనునొ కేఁడు "కవిమూర్ధన్యా
నీ కిట్టు లనఁగఁ జెల్లునె !, సీ! కలిపురుషుండ వంచుఁ జీవాట్లిడునో. 184

---

## సతీర్థ్య సంప్రార్థనము.

(వే. ప్రభాకరశాస్త్రి) స్వధర్మప్రకాశినినుండి.

శా॥ అమ్మా! భారతి! కేలుమోడ్చుకొని నిన్ యాచింతు నొక్కింత నీ।
సమ్మానమ్మునఁ జేసి మాభరతవర్షమ్మందు విద్యాతరుల్। రెమ్మల్ కొమ్మలు గల్గి
పల్లతుల వర్ధిల్లన్ వలెన్ సర్వశాం। తమ్మై పోవలె నెందుఁ బండితవివాదస్ఫార
దావోద్ధతుల్॥ మ॥ ఉడుగుండయ్యా సతీర్థ్యులార! యుడుగుం డొప్పో తప్పో
నో మీ। యడుగుల్ మ్రొక్కి విధేయభావమున నభ్యర్థించుచున్నాఁడ; మీ। నుడు
గుల్ పత్రికలోఁ బఠించి రవి పీనుల్ మూఁచినట్లయ్యె నే। చెడుగుల్ కోకిలకాక
ముం గనిన మీచెయ్దమ్ములన్ మెత్తురే॥ ఉ॥ శ్రీకర చెళ్లపిళ్లకులసింధుశశాంకుని
వేంకటేశ్వరా। ఖ్యాకుని సద్గురుప్రవరుఁ గాకినిగా మఱి నిష్కళంక స। ద్ధీకుని
దత్సమున్ దిరుపతిన్ గురుపండితుఁ గొంగఁ గాఁ దనుం। గోకిలఁగా వచించు
కొని కొండొక కైతము వెల్లడింతురే॥ శా॥ అచ్ఛానేకమహర్షినిర్మితమహోర్ధ్వా
చార నిర్మాణముల్। స్వేచ్ఛాచారులు నేఁటికాలమునయం దెందెందఱో విజ్ఞవే।
పచ్చన్నుల్ పడఁగొట్టు నందు గురుశిష్యన్యాయనిర్మాణ మూ। లోచ్ఛేదమ్మున
కీపు పాల్పడితిరో కొక్కా! రామకృష్ణాహ్వయుల్॥ ఉ॥ చిల్లులగవ్వయే నఖిలషిం
పక విద్దియ నేర్పు కూర్మి సం। ధిల్లఁగఁ గాంచు సద్గురు విధేయతమైఁ గనుచుం
బఠిం బదిం బల్లనివేళ సంస్మరణ సల్పుచు నుండుటలేక యిచ్ఛమైఁ గల్లలుపల్కి
రేమి యధికమ్ము గణింపఁ దలంపఁ గొంటిరో॥ చ॥ శ్రమపడి విద్యలం గఱపి
సాఁకి ప్రయోజకుఁ జేసి వృద్ధికిం। బ్రమదముఁ జెందు సద్గురు సభాస్థలిఁ బేర్కొను
టాత్మగౌరవ। క్రమపరిహారకారణముగాఁ దలపోసెడువారి నేరిఁ గాం। నము
నిన మెప్పు; డిప్పుడు కనన్ విన నయ్యెఁ గదయ్య యియ్యెడన్॥ మ॥ గురువుల్
తిర్పతివేంకటేశ్వరులు మీకున్ మాకు నిక్కంబు; త। త్కరుణాసారమె కార
ణమ్మరయ విద్యాబీజ మొక్కింత యం। కురమందన్ మన కెల్ల నిక్కముగ
మాకున్ వారికిన్ శిష్యతా। గురుతల్ లేవను ధీనుడుల్ వినిన నేకూ్రియుండఁడు
నం గుందెదున్॥ ఉ॥ "చెప్పుటలేద" యంచును వచించితి రొక్కఁడఁ జెప్పె

